# విజ్ఞప్తి.

తే. ఇందుఁగలపద్యములు విన్నఁ గొందఱొప్పు
అతిశయోక్తులతో మెచ్చుక[illegible]
కొంచెమైన గుణంబుండునంచు [illegible]
యీ "కవిహృదయము" ను బ్రకటించినాఁడ.

తే. పొగడు నొక్కండు మఱొకండు తెగడుచుండు
నఖిలజనులను మెప్పింప వలవియగునె
ధాతకైనను మఱి వానితాతకైన
నందుచేఁ జంకుటుచితంబె? యదియుఁ గాక
కాకిపిల్ల కాకికి ముద్దుగాదె యెపుడు.

తే. పోతన కృతిపతియగుటచేత నేమొ
దీని ముద్రితంబొనరింపఁ బూనె నెలమి
నమల చెలికాని లచ్చరాయ రసికుండు
తన మహౌదార్యమునకు నిదర్శనముగ.

సీ. జాహ్నవీమాహాత్మ్య సత్ప్రబంధంబును
వాల్మీకిచరితయన్ప్రౌఢకృతిని

విందాపరిణయాఖ్య వెలయుదాని
శ్రీరంగమాహాత్మ్య భూరికావ్యంబును
శతకరత్నంబైన చంద్రదూతఁ
గ్రమ సీమంతినీకల్యాణకావ్యంబు
మఱి రంగనాథ రామాయణంబు

గీ. నింక నట్టి యముద్రితహృద్యకావ్య
శతకరాజంబు లెన్నెన్నొ సముచితమతి
నచ్చువేయించి ప్రకటించు లచ్చరావు
నిరుప మాంధ్రసారస్వతోద్ధరణ దివ్య
కార్యనిరతుండు వంద్యుండుగాఁడె మనకు.

తే. ఆంధ్రపరిశోధన ఘన కార్యాలయమును
తదధిపతిని, సమస్త సత్కవివరులను
దేశభక్తుల, నాశీర్వదించుఁగాత
సకలహృద్వర్తి శ్రీరామచంద్రమూర్తి.

పిఠాపురము.
17-12-1922.

జనమంచి సీతారామస్వామి.

## అంకితము.

---

గీ. కృష్ణముఖవేణురవమంత హృద్యమైన
శ్రీమదాంధ్రభాగవతంబుఁ జేసినట్టి
మహిత బమ్మెరపోతనామాత్యకవికి
నంకితమొనర్తు నీపొత్త మమితభక్తిఁ
జంద్రునకు నూలిపోఁగను సరణిగాఁగ.

ఓం.

# కవిహృదయము:

ఆ. సరసముగఁ దనంత సంప్రాప్తమైనప్డె
కడుసుఖంబుఁ గూర్పఁగలదు కవిత
బల్మి నీడ్వఁబడినవనిత యిట్లబ్బిన
కవితవలన హాయి గలుగఁబోదు. 1

❖

ఆ. రసమె కావ్యకాంతప్రాణంబుగావున
రసవిహీనమైన గ్రంథమేల
జాతిబొమ్మ పైకి రమ్యమైయున్నను
కామి కేమిసుఖముఁ గలుగఁజేయు. 2

❖

ఆ. పద్య మెంతమంచి భావంబుగలదైన
మధురశైలిగాని మధురమగునె
గార్దభస్వరమునగానపండితుపాట
యెట్టిశ్రోతకైన హృద్యమగునె. 3

ఆ. కావ్యశైలియెంత కమనీయమైనను
భావగరిమలేక భవ్యమగునె
పయిమెఱుఁగులు చూపు ప్రౌఢవేశ్యయయినఁ
గనునె కులసతిగను గౌరవంబు. 4



తే. రమ్యభావములుగలిగి రమ్యశైలి
నలరు సత్కావ్య మెల్లర నలరఁజేయుఁ
గావుననె పోతనార్యుని కవితయంత
సర్వజనరంజకంబై ప్రశస్తికెక్కె. 5



తే. ఆంధ్రభాగవతంబునే యాంధ్రుఁడైన
నెన్నిసారులు చదివినఁ దృప్తిలేక
మఱొకమాటు, మఱొకమాటు, మఱొకమాటు
చదువకుండ విడిచిపెట్టఁజాలునొక్కొ! 6

తే. అవని నెవనికి దాసోహమననిసుకవి
రహి స్వతంత్రతయనెడు స్వర్గమునసుండి
పరమకవితాభిధానవృష్టిఁ గురిసికురిసి
అందఱకు నుపకారిగా నబ్బురముగ ! 7



తే. ధరణి సామ్రాజ్యధౌరేయు శిరములోనఁ
దేళ్లు జెఱ్ఱులుఁ బ్రాకెడి నెల్లవుడును ;
మహితకవితాధినాథుని మౌళియందు
విమలభావతరంగిణి వెల్లివిరియు. 8



ఆ. తప్పులున్నవంచు ధాత్రి నేకవినైన
దెప్పిపొడుచుటెంతొ తప్పుసుండి
యొక్కతప్పులేక యుండు కవితయందు
నొక్కసుగుణమైన నుండదేమొ. 9

తే. ఎంతగొప్పకవితనైన నేదొ దోష
మగపడునుగానఁ గృతిదూష్యమనఁగఁదగునె
నిండు శశియందుఁ గాసంత నీలముండు
నంతమాత్ర నతఁడుగాఁడె యమృతకరుఁడు. 10



తే. రసము ప్రవహింపకుండ నొక్కసమయాన
వ్యాకరణ మడ్డపడఁబోయినపుడు దాని
నవలకును ద్రోసివేయుటె యవసరంబు
గాని, రసముఁబోఁగొట్టుట కవితచేటు. 11



తే. వ్యాకరణము కవితకత్తవంటి దాటఁ
బరుషభాషలనాడక సరసలీల
దాని సవరించుచున్నఁ గృతార్థయగును
గానిచోఁ గోడలికిఁ బ్రాణహానిగల్గు. 12

తే. సగముచచ్చినఁగాని చేసాఁపఁబోఁడు
పూర్తిగాఁజచ్చులేదను ముక్క విన్న
యాచనముచేయవలసినయట్టి సుకవి
బాధ వర్ణింపనలవియె బ్రహ్మకైన. 13

ఆ. రాజు నాశ్రయించు ప్రకటకవియుఁగూడఁ
బరుల కవితమెచ్చి పలుకరాదు
పలికియుండినఁ దనపని సున్నగావచ్చుఁ
బలుకకున్నఁ గవుల కలుకవాడము. 14

ఆ. ధరణివిభుఁడు నవ్వఁ దాను నవ్వవలయు
నేడ్చునేని తాను నేడ్వవలయుఁ
జవటమాటయన్న సరసోక్తియనవలెఁ
గడుపుకూటికిఁ బాట్లు పడెడువాఁడు. 15

ఆ. కవితలోనిరసము గ్రహియింపలేకయు
ధనముఁ గవికినొసఁగు ధనికుకంటెఁ
గవితలోనిగుణముఁ గాంచి చేతులుమోడ్చు
బీదవాఁడె ఘనుఁడు వేయిరెట్లు. 16



ఆ. నవరసముల నేది మివులఁ బ్రశస్తమొ
నిర్ణయింపఁగలమె నిశ్చయముగ
నొకనికిష్టమైనదిఁక నొక్కనికిఁగాదు
భిన్నరుచులు జగతి వెలసియుంట. 17



తే. కొత్తిమిరియన్నఁ బ్రాణంబు కొందఱకును
నల్లికంపు చీయని కొంద ఱొల్లకుండ్రు
ఉల్లిపాయలుగన్న నోరూరునొకని
కేవపడి మొగముత్రిప్పు నింకొకండు. 18

తే. పరమశృంగారభరిత ప్రబంధమన్న
ననుపమానందదాయకమనునొకండు
ప్రకటవీరరసాంచితగ్రంథమన్న
నిరుపమోల్లాసకరమను మఱియొకండు. 19



ఆ. ఏరసంబుఁ జెప్పనెంచినఁ దనకృతి
నారసంబు పాఠకాళి మనసు
లంతు వెల్లివిరియునట్లు చేయఁగలుగు
ధన్యుఁడె కవియనఁగఁ దగినవాఁడు. 20



ఆ. సృష్టిలేనిదాని సృష్టింపఁగలవాఁడు
కమలజుండుగాని కవివరుండె?
ఉన్నదానిమాత్రి మెుప్పింపఁగఁ జెల్లు
కవిత విశ్వముకుకముపుచుఁ గాత్రిలు. 21

తే. పచ్చికూరలఁ గైకొని వంటవాఁడు
తగినరీతిని లవణాదిద్రవ్యములను
గలిపి కమ్మని భక్ష్యంబుగానొనర్చు
నట్లు కవియును గావ్యంబు నమరఁ జేయు. 22

❖

తే. రవియుఁ గాంచఁగలేని వస్తువునుగూడఁ
గవియె భావనాశక్తిచేఁ గాంచఁజాలి
కావ్యమునఁ బ్రదర్శించును గ్రమ్మఱ లిఁ
జిత్రకుఁడు చిత్రరచనంబుఁ జేయునట్లు. 23

❖

తే. నిన్నెఱుఁగను పోపొమ్మని నిజవిభుండు
పలుక నెట్టులుండెనొ శకుంతలమనస్సు
కాళిదాసమహాకవి కనులతోడఁ
గాంచినాఁడె భావనచే గ్రహించెఁగాని. 24

ఆ. ఎవని కెంతబుద్ధి యీశ్వరుం డిచ్చెనొ
వానిఁబట్టియుండు వానికవిత
పిండికొంచెమున్నఁ బెద్దరొట్టెయగునె
యెంతశ్రమముపడ్డ నంతెగాక. 25

❖

ఆ. తుక్కుపుస్తకములు పెక్కొనర్చుటకంటె
నుత్తమమగుగ్రంథ మొకటెమేలు
గొడ్డుగేదెలెన్నొ దొడ్డినింపుటకంటెఁ
బాలయావొకండె మేలుగాదె. 26

❖

తే. పచ్చిబూతులచే నింపఁబడిన కావ్య
మతుల శృంగారభూయిష్ఠమనఁగఁదగిన
నిచ్చవచ్చినగతి బూతులెన్నొయాడు
పసులకాపరులందఱుఁ బ్రౌఢకవులె. 27

ఆ. సతియుఁ బతియుఁ దమిని శయనగృహముఁ జేరి
రతులఁ బెనఁగినట్టి గతులనెల్ల
బట్టబయలుచేసి వర్ణించి చెప్పిన
రోఁతగలుగుఁగాని ప్రీతియగునె. 28



తే. ఏవొ మోటువాక్యముల నవ్వించు కవిత
హాస్యభరితంబుగాక హాస్యాస్పదమగుఁ
బ్రజల నెట్లొ నవ్వించు చే ప్రజ్ఞయైనఁ
బగటివేషగాండ్రిందఱుఁ బ్రాథకవులె. 29



తే. రాత్రి యేదొవిశేషంబు ప్రాప్తమయ్యెఁ
గోమలికని పరిభావతిఁగూర్చి హాంసి
య నెకచతురతఁ బరిహాసమాడెనంట
ఔర! రసమన్న నీసొమ్ము సూరనార్య. 30

ఆ. హద్దుమీఱినడచునట్టి జవ్వను లెప్పు
నార్యజనులనింద నందునట్లు
మృదుతదప్పినట్టి శృంగారహాస్యముల్
ప్రాజ్ఞజనులగర్హఁ బడసితీఱు. 31

❖

తే. కావ్యనాటకకర్తలె కవులుగాని
శతకకర్తలు గారంట సత్యమగునె
గ్రంథమేదైన సరసమై క్రాలెనేని
తత్ప్రణేతయు గణ్యుండె ధన్యకవిగ. 32

❖

తే. పరమరుచిగ వంకాయలు వండువోఁడ
భోక్తజనపాళి మెప్పును బొందఁదగినఁ
బనసకాయలు బాగుగా వండనేర్చు
ప్రోడమాత్రము మెప్పును బొందఁదగఁడె. 33

ఆ. గద్యకావ్యమైనఁ బద్యకావ్యముమాడ్కిఁ
బ్రౌఢశైలిలోనఁ బరఁగునేని
గద్యకర్తగూడఁ బద్యకర్తవలెనె
ప్రౌఢకవియనఁదగు రసికులార. 34



తే. రసమునొలికించెడు వచనరచననెసఁగు
భవ్య "కృష్ణా" ఖ్యపత్రికా వ్యాససరణిఁ
బాఠకమనోహరంబయి పన్నె కెక్కు
నట్టికవిత చెప్పగలవా రరుదు నేఁడు. 35



ఆ. పద్య మల్లఁజాలువారెల్లఁ గవులైనఁ
గవుల లెక్కపెట్టఁగలమె మనము!
గరిటెఁద్రిప్పుమాత్ర ఘనపాచకులెయైనఁ
బృథివిఁ బ్రతిగృహంబు భీమమయమె. 36

తే. మత్సరగ్రస్తుఁడైనట్టి మానవునకు
ఘనకృతియు హీనకృతిగానె కానిపించుఁ
బచ్చకామెర్లజబ్బున్న వానికెల్ల
వస్తువులు పచ్చగానె కన్పట్టునట్లు. 37



ఆ. కవితలోనిగుణము గ్రహియింపఁగల్గుట
కనుభవంబులేక యలవిగాదు
తినకయున్న రుచియు, దిగకున్న లోఁతును
చెప్పఁగలమొ మనము తప్పకుండ ? 38



తే. భక్తిరాజ్యాభిషిక్తుఁడౌ పరమయోగి
పరుల దూషణభూషణవాక్యములను
సరకుసేయక యానందసాగరమున
నోలలాడునట్లె కపియు నోలలాడు. 39

తే. అమరనది జగత్పావనియైనకరణి
సుకవితామృతవాహిని సకలలోక
నిరుపమోపకారిణియయి పరఁగుచుండుఁ
గాన దానికి నానమస్కారశతము. 40

---

తే. నీదయావిశేషంబులేని తరుణమున
నీవిభుండె నోరు మెదల్పనేరఁడనఁగ,
నింక మాయవస్థను జెప్పనేల వేఱ!
కాన సుకవుల సతతంబుఁ గరుణఁజూడు
సరససద్గుణాలంబ! శ్రీశారదాంబ!
తే. ధనకనకవస్తువాహనతతినిగోర;
బ్రదికియున్నంతకాలంబుఁ బరమభక్తిఁ
దావకామలపాదాబ్జసేవనంబు
నేను సల్పునట్టు లనుగ్రహింపవమ్మ
సరససద్గుణాలంబ! శ్రీశారదాంబ!

## ఈకవిరచియించినయితరగ్రంథములు.

| | | |
|---|---|---|
| 1. | ప్రహ్లాదచరిత్ర | 0- 6-0 |
| 2. | భీష్మమహిమ | 0- 8-0 |
| 3. | శ్రీరామచంద్రమూర్తి | 0-12-0 |
| 4. | ఈశ్వరతారావళి | 0- 1-6 |
| 5. | భారతమాతృవిలాపము | 0- 3-0 |
| 6. | రాజ్యప్రాప్తి | 0- 6-0 |
| 7. | ఆంధ్రమాతృస్తవము | 0- 0-6 |

## వెలువడఁబోవునవి.

8. గురుదక్షిణ.
9. రాఘవశతకము.
10. సావిత్రి.
11. వ్యాసమంజరి.
12. ఆంధ్రశివానందలహరి.

